# అప్పాకొడుకు

(కాంగ్రెస్ చరిత్ర)



వల్లభనేని కాశీవిశ్వనాథం

ప్రజాప్రచురణలు

పవరుపేట :: ఏలూరు.

# అభిప్రాయాలు

ఇది భారత స్వాతంత్ర్య ఉద్యమ గాథ. బాలలకై మిత్రులు శ్రీ కాశీవిశ్వనాథంగారు గేయరూపాన రచించినారు. విషయమంతా అమ్మా కొడుకు మధ్య సంభాషణ రూపాన సాగింది. ఈ గాథను పాటగా అల్లడానికి శ్రీ కాశీ విశ్వనాథంగారు చాల శ్రమించినారు. అనేక గ్రంథాలనుండి విషయాన్ని సేకరించినారు.

ఇంతకు పూర్వం శ్రీ కాశీగారు భారత వీర విప్లవ గాథను 'తాతా మనుమడు' అన్న పేరున వెలయించినారు. మన తెలుగు బాలబాలికలందరు తప్పక భారత స్వాతంత్ర్యోద్యమ గాథను తెలుసుకొనవలెనని వారు సంకల్పించుకొన్నారు. ఈ సంకల్పము చాల మెచ్చుకో తగినది.

అక్కడక్కడ భాష కొంత ప్రౌఢంగా నడచినా విషయ వివరణకు ఎక్కడా భంగం కలగని రీతినే సాగిపోయింది.

ప్రతి తెలుగు బాలుడు; తెలుగు బాలిక; ఈ దేశభక్తి ప్రబోధితమైన గేయ కావ్యాన్ని చదివి మేలు పొంద గలరని ఆశిస్తున్నాను. శ్రీ కాశీవిశ్వనాథంగారు మరిన్ని కావ్యాలు బాలలకై రచించి భాషాసేవ చేయగలరని నమ్ముతున్నాను.

ఏలూరు
3-3-61

బి. వి. నరసింహారావు.

అమ్మా కొడుకూ అనే గ్రంథం ఆదినుండి తుదివరకూ చదివాను. చిన్నపిల్లలకు కాంగ్రెసు చరిత్ర గేయ రూపంలో వ్రాయాలని బుద్ధి పుట్టి శ్రీ కాశీవిశ్వనాథంగారిలా వ్రాసినందుకు అభినందిస్తున్నాను.

గేయం అద్భుతంగా నడచింది. చాలా అందంగా వుంది.

శ్రీ కాశీవిశ్వనాథంగారు చేసిన కృషికి నాకు చాలా సంతోషం. పిల్లలకు ఇటువంటి గ్రంథాలు ఇంకా వ్రాసి బాల బాలికల విజ్ఞానానికీ – దేశభక్తికీ – దోహదం చేయ వలయునని కోరుతున్నాను.

బందరు
4–3–61. కొడాలి ఆంజనేయులు.

జాతీయ కాంగ్రెసు కథ – తల్లి కొడుకుకు వినిపించుట చాలా సొంపుగా నున్నది.

తణుకు
16–3–61 ముదిగంటి జగ్గన్నశాస్త్రి.

# కృతజ్ఞత

అభిప్రాయము లొసగిన

పెద్దలకు



ప్రజా సేవకుడు

ప్రశాంత చిత్తుడు

ప్రగతి పథ పథికుడు

ప్రియ మిత్రుడు

శ్రీ గద్దె వెంకటేశ్వరరావు గారికి

## కొడుకు

అమ్మరో నా కొక్క
కమ్మనీ కథజెప్పు !

దయ్యాల భూతాల
బుయ్యారమైనట్టి
కథలేమి వద్దమ్మ
కమ్మగా నుండవవి !

భారతము భాగవత
రామాయణములాది
గీతలో గల లోతు
నీతికథలంటూను
నూరిపోసిందమ్మ
నానమ్మ ఇందనుక !

తెలుగు కావ్యములందు
విలువైన కథలెల్ల
సులువుగా వివరించి
అమ్మమ్మ జెప్పింది !

వాసిగాంచిన యట్టి
కాశిమజిలీ కథలు
బోసినోటితొ తొస్సి
బోకుండ తాతమ్మ
నిన్ననే చెప్పింది !

దేశదేశాలలో
తేజరిల్లినయట్టి
జానపద కథలెల్ల
జాగ్రత్తగా చూచి
అక్కయ్య నాకెంతొ
మక్కువతొ జెప్పింది !

ఆజాదు రాజగురు
సుఖదేవు భగత్సింగ్
అమరగాధలు కలిపి
ఆనాటి విప్లవము
తాతయ్య వర్ణించి
తనివిదీరా నాకు
వినిపించినాడమ్మ !

## అమ్మ

అందరన్నీ జెప్పి

ఆనందపరివారు !
అమ్మనూ నేనేమి
అధికంబు చెపుదురా
అయిననూ నా బాబు
అడుగరా చూస్తాను !

## కొడుకు

గేటుపై కులుకుచూ
గోచేము జిమ్ముచూ
ముద్దులొలికించేటి
మువ్వన్నె కేతనము
జాతికే వెలుగంట !
పూతమైనాదంట !
ప్రఖ్యాతి గనెనంట !
పలుకవేమే అమ్మ ?
కునుకులో నుంటివా ?
ఆ కథన్ జెపుమమ్మ !

## అమ్మ

జాతికీ మాతకూ
జ్యోతియౌనది బాబు !
జాతీయ కాంగ్రేసు

ఊతగఱ్ఱది బిడ్డ !
పెనుగాలి నెదురుచూ
వినువీధి నెగురుచూ
విజయచిహ్నంబౌచు
విఖ్యాతి గాంచింది
విశ్వమంతట తాను !

మనజాతి కేతనము
మదికందదా నీకు
మా బాబు వినుమిదిగో !

సామ్రాజ్యవాదులన్
సాగనంపినదద్ది !
స్వాతంత్ర్య సంగ్రామ
చరితంపు సంకేత
కేతనమ్మది బాబు !

జాతీయ సమరంపు
జయదుందుభీ చిహ్న
మందాల బావుటా
హుందాను పరికించు !

## కొడుకు

అమ్మరో పూర్తిగా
అర్థమయ్యేటట్లు
వివరమ్ము లెరిగించి
విశదమ్ము జేయుమా !

## అమ్మ

కళలు విరజిమ్మేటి
కాంగ్రేసు కట్టడము
కథ నాలకించరా
కమ్మగా వినుపింతు !

త్యైయాబ్జి - బేనర్జి -
హ్యూముదొరలాదిగా
కీటుద్రొక్కినవారు !

బాల - లాలూ - పాలు -
గోఖలే - మెహతాలు -
గోడగట్టినవారు !

గాంధీజి - రాజేంద్ర-
జవహ్వరు - పటేలులూ

ఇల్లుగట్టినవారు!

ఆ యింటిలో మనము
హాయిగా వుంటున్న
భారతీయులమయ్యా!
భాగ్యవంతులమయ్యా!

ఆ యింటి ముంగిటన్
అలరారుచున్నట్టి
అందాలకేతనము!
అంతుపట్టెనుగదర
అబ్బాయి! మనజాతి
కేతనము కథ నీకు!

## కొడుకు

ముక్తసరిగా నీవు
మూడు ముక్కలలోన
ముగియించినావమ్మ
మాతరో! మరికాస్త
మదికెక్కు రీతిగా
పదిలపరచుము తల్లి!

ప్రఖ్యాత కాంగ్రేసు
పాఠమున్ మనసార !

అమ్మ

అరువదేండ్లకుపైన
రణతలమ్ముననిల్చి
అరిభయంకరమైన
ఆంగ్లప్రభుతను నెట్టి
అధికారమును పట్టి
అధిపతులు మనవారె
అయినారురా బాబు !
అందుకాదర్శమా
అధికార చిహ్నమీ
ఆకాశకాంతిరా !
అందాలజిలుగురా !

కొడుకు

అరువదేడుల కథను
అందించుమో తల్లి !

అమ్మ

ప్రప్రథమ స్వాతంత్ర్య

ప్రథనమ్ము ఫలమీక
జనతలో చైతన్య
మడుగంటి స్తంభించ;
ఈధాత్రిలోనున్న
మేధావులౌ నరులు
సక్రమపు రాజ్యాంగ
చట్టాల - సాగారు
టభివృద్ధిమార్గమగు
అది సమన్వయమునగు
సాఫల్య మొనగూర్చు
సాగారుడని సాగి
బాగేమి లేకనూ
మూగబారుటతోడ,
అతివాదశక్తులిట
శ్రుతిమించి రాగాన
దశదిశల వ్యాపించి
ధగధగల్ ఎగజిమ్మ
హొగమాత్రమీనాట
పుక్కిలింతల విడువ
దౌర్జన్యరాహిత్య
ధర్మయుద్ధంబౌను
కర్మయోగుల కనుచు

ఉందంతమాటలో
కొండంతభావంబు
గుప్పించిగాంధీజి
సత్యాగ్రహాస్త్రమున్
సారించి విడిచాడు
సాధించినిలిచాడు
స్వాతంత్ర్యమీనాట !

కొడుకు

గాంధీజి ఒక్కడే
కదనమ్ము జరిపెనా ?
వినగోరుచుంటినే
వివరించుమోయమ్మ !

అమ్మ

స్వాతంత్ర్యసంగ్రామ
సంరంభమందునన్
శౌర్యధైర్యప్రముఖ
సాహసోపేతులౌ
శక్తిసంపన్నులే
సమిధలై పొయ్యారు
అమరులై నిల్చారు !

[2]

అరయరాఅబ్బాయి
ఆకథన్ వివరింతు !

ప్రాభవమునందున్న
పెద్దఉద్యోగులౌ
వైస్రాయిడఫ్రినూ
హ్యూముదొరలాదిగా
ఒనరించుకృషివలన
కలకత్త బొంబాయి
మద్రాసు మొదలుగా
నగరాలలోనున్న
దేశీయసంక్షేమ
సంస్థలన్నిగలసి
జాతీయకాంగ్రేసు
జన్మకారణమాయె !

జాతీయకాంగ్రేసు
జనకుడౌ హ్యూముదొర
జ్యోతిగా వెలుగొందె !

కొడుకు

తమజాతి పాలనమె
తగదంచు ఎదిరించ

తలపడెన దొరలట్లు ?
తెల్పవమ్మా తల్లి ?

## అమ్మ

కోతిగొనములవారు
జాతివారని గాని,
మతమువారని గాని;
మమత జూపించుటది
నీతివంతుల కెపుడు
నిజముగా సరిపడదు !

ప్రప్రథమ కాంగ్రేసు
కధ్యక్షుడై నాడు
బేనర్జి బొంబైని !

పాలనాచక్రమున
పాలొసగి ప్రజలకు
పాలించుడంచుసూ
ప్రభుతనే యాచిస్తు
ప్రకటించినారయా
పరిషత్తులో నాడు
పెద్దలెల్లరు గూడి !

నౌరోజీహాళియై
మరుసమావేశమా
కలకత్త నగరాన
కనుల విందొనరించె!

మదరాసు నగరాన
కాంగ్రేసు గద్దెపై
తయ్యాబ్జి వెలుగొందె!

అల ప్రయాగను గూడు
నాలుగవ కాంగ్రెసుకు
జార్జియూలధ్యక్ష
దర్జాలు జూపించె!

జాతీయకాంగ్రేస్సు
పంచమీ పరిషత్తు
బొంబాయిలో నాడు
వెదర్బర్న్ వేదికై
వెలుగొందె దిశలెల్ల!

కలకత్త కాంగ్రేసు
గద్దెపై నెక్కియా

ఫిరోజిషా మెహాత
సింహగర్జన జేసి
చీత్కారముల్ దెలిపి
సీమదేశీయులన్
చీటికీ మాటికీ
చిన్నబుచ్చిన గూడ
చీమునెత్తురు లేని
సామ్రాజ్యమెంతయున్
సన్నగిల్లనె లేదు!

నాగపుర కాంగ్రేసు
బాగుబాగనగాను
ఆనందచార్యులూ
అధ్యక్షుడై నాడు!

త్రివేణి సంగమమున
తీర్థమౌ కాంగ్రెసుకు
బేనర్జి ప్రెసిడెంటు!

జోహారులంగొంటు
లాహోరు కాంగ్రేసు
గద్దెపై నౌరోజి

వర్థిల్లినాడురా !

## కొ డు కు

తాహతెంతో గలుగు
తాతయ్యలెందగో
తఖ్తులెక్కారంటు
తనివొందజెప్పావు
తల్లిరో ! సరెగాని
ఫలితమేమయ్యెనో
పలుకాడలేదమ్మ ?

## అ మ్మ

జాతీయకాంగ్రేసు
శైశవావస్థలో
చట్టసభలో తగ్గిన
సభ్యత్వముం గోరి
సాధించతలపడియు
గోముగా మారాము
ఎనుబదై దూనుండి
ఏడేండ్లు జేసింది !

అమిరింది మదరాసు

జాతీయకాంగ్రేసు
అధ్యక్షపీఠంబు
ఆల్ఫ్రెడు వెబ్డారకు !

జాతీయకాంగ్రేసు
పూనాసమావేశ
పూజార్హపీఠమ్ము
పైనెక్కె బేనర్జి !

పదియేండ్లు వరుసగా
పరిషత్తులయ్యాక
లక్షలాదిప్రజల
దీక్షయౌకాంగ్రేసు
ప్రభవకారణ మనుచు
ఇండియాకౌన్సిల్సు
యాక్టునే నిరసించి
ప్రజలపై బడబోవు
పన్నులను నిరసించి
పలుకాడ గలిగింది !

కలకటాకాంగ్రేసు
కాన్ఫ్రెన్సుకానాడు

రహింతులసాయాని
రాజాయెనంటరా !

అమరావతీపురిని
జాతీయకాంగ్రేసు
అధ్యక్షుడై నాడు
శంకరన్నాయరూ !

మదరాసుసభలోన
మకుటమై నిల్చాడు
ఆనందమోహనా
బోసుబాబానాడు !

లక్నోసమావేశ
ముఖ్యమౌకాంగ్రెసు
అధ్యక్షుడై నాడు
ఆరసీ దత్తుండు !

లాహోరుకాంగ్రెసు
అందలమ్మెక్కాడ
చందవర్కారప్పుడు

## కొడుకు

కన్నతల్లీ ! నాకు
కలదొక్క సందియము !
కాంగ్రేసు సంస్థేమొ
గడిదేరి గడుసుగా
పండువెన్నెల గాయు
నిండుచందురుడట్లు
నిలబడ్డ దంటావు
నిర్ణయము దెలుపవూ !

## అమ్మ

గ్రాహ్యమ్మ గాలేద
గంభీరవిషయాలు ?
మనసుంచి వినవోయి
మహనీయ చరితమ్మ !
పదునైదు ఏండ్లేమొ
పైబడ్డ కాంగ్రేసు
నియమ నిబంధనముల
నిర్ణయముజేసుకుని -
తలకు నిర్బంధమున్
తీవ్రముగ నిరసించి -
అరవిందఘోషాది

అభ్యుదయ వాదులన్
అనుగమించిందపుడు !

జాతీయకాంగ్రేసు
కలకత్త గద్దెపై
ప్రముఖుడాయెను వాచ !

అహమదాబాదులో
సమకూడు కాంగ్రేసు
సభకు అధ్యక్షుడై
నిప్పుకణములు కక్కి
గొప్పగా మాటాడి
కాలనీలల బోలి
కరణీక మడిగాడు
సూరేంద్రనాథుడూ ।

మదరాసు మహాసభ
మంచెపై నిల్చుండి
లాలుమోహనఘోషు
లగువుబిగువులు జూపె ।

బొంబాయి కాంగ్రేసు

గద్దెపై కాటనూ
ఒద్దికన్ గూర్చుండె।

కాశికాపురమునను
కాంగ్రేసు గద్దెక్కి
రాజకీయములందు
రాటుదేలినవాడు
గోఖలే - గొప్పగా
రాజ్యాంగధర్మాల
తర్కమీమాంసలన్
వాదపటిమను జూపి
గోదాకు దింపినను
పాలించు సామ్రాజ్య
పశుబలమ్మిసుమంత
పట్టుడిగిపోలేదు !

ఇరువదేండ్లప్రాయ
మినుమడించకముందె
కర్జనూ దొరగారి
దుర్జనత్వము దెలుపు
చట్టాలగుట్టంత
బట్టబయలొనరించి

బుట్టదాఖలుచేయ
పట్టుబట్టిందిరా।

వంగవిభజన తంతు
అంగవైకల్యమని
రంగవల్లిని చూపి
క్రుంగిపొయ్యిందిరా ।
మాయమర్మము నెరిగి
లాయలిష్టుగ నుంటు
"పాలనాశాఖలల
పదవులన్నికూడ
భారతీయుల కిడిన
పదివేలు మాకన్న"
నౌరోజి శౌర్యమున
శ్వేతపాలన మిటను
శేషించరాదంటు
ఆంగ్లపాలన మిటను
అంతరించాలంటు
అరమరలు విడనాడి
ఎలుగెత్తి చాటాడు
కలకటా కాంగ్రేసు
గద్దెపై తానెక్కి

దాదభాయ్ నౌరోజి
దండిగా ఆనాడె।

సూరత్సమావేశ
రణరంగ కేంద్రమున
రాణించె చంద్రుడై
రాస్బిహారీఘోషు।

స్వపరిపాలన మాకు
సామాన్య కాంక్షంటు
మదరాసులో మళ్ళి
గద్దెక్కెగా ఘోషు।

మాలవ్యపండితుడు
కాలోచితంబుగా
లాహోరులో నాడు
కాంగ్రేసు గద్దెక్కె।

## కొడుకు

గద్దెక్కె గద్దించి
గడియించి తెచ్చింది
కనరాదు। వినరాదు।

గమ్మత్తుగా వుంది
కథమాత్రమోయమ్మ !
కడవరకు గానిమ్ము !

## అమ్మ

జోలపాటలు మీరి
బాలప్రాయము గూడ
రాజ్యాంగసభలోన
ముద్దుమాటలు కూర్చి
కద్దు మాకిది యంచు
పద్దులను జేర్చంగ
వద్దికెంతనో జూపి.
వాదించి నిల్చింది
పందొమ్మిదొందలా
తొమ్మిదీదనుక నా
పదియారు వర్షములు !

అలహాబాదున- తిరిగి
అధ్యక్షుడైనాడు
జాతీయ కాంగ్రెసుకు
విలియం వెడర్బర్న్ !

ఇరువదైదవయేట
మితవాద ప్రాబల్య
గతులలో బడియునూ
మతమె ప్రాధాన్యమై
జతగూడు ప్రత్యేక
నియోజక వర్గాల
నిర్ణయము నెదిరింది !
మతసామరస్యమున్
మనసార కోరింది !

కలకటా కాంగ్రేసు
గద్దెపై- బి. యన్. ధర్
ఒద్దికన్ గూర్చుండె !

బంకిపూర్కాంగ్రేసు
అధ్యక్షుడై నాడు
ఆరెన్ మధోల్కరూ !

సయ్యదూ మహమూదు
చల్లంగ కరాచీ
కాంగ్రేసు గద్దెపై
కాలెట్టినాడంట !

మదరాసు కాంగ్రేసు
భూపేంద్ర బాసుకూ
భువన విజయము గూర్చి
తొలి లోక యుద్ధమున
తోడాయె బ్రిటనుకూ !

బొంబాయి కాంగ్రేసు
బ్రహ్మాండమౌ సభను
సత్యేంద్రసింహాకు
ప్రత్యేక గౌరవము !

హిందువులు ముస్లిములు;
విడివడ్డ కాంగ్రేసు
ఇరుతెగలవారున్ను:
ఐక్యమున్ బొందినా
ఆనందమందినా
అల లక్నో కాంగ్రేసు
అధ్యక్షుడై నాడు
అంబికామజుందారు !

లోకమాన్యుడు తిలకు
గాంధీమహాత్ములన్

లోబరచుకొన్నాది;

మగవానితో బాటు
మగువకూడా నంటు !
అంటుదోషం బీడ
అంతరించాలంటు !
మర్మగర్భితమైన
తీర్మానముల్ జేయు
కలకత్త కాంగ్రేసు
అధ్యక్షురాలాయె
అనిబిసెంటమ్మపుడు !

ముప్పదవ పడిలోన
మురిపాల కాంగ్రేసు -
ముగుద బీసెంటమ్మ
హోమురూలుద్యమము
గనికరించిందంతె !

హాసన్ ఇమామపుడు
భాషించె బొంబాయి
కాంగ్రేసు పెద్దయై !

ఉల్లమారగ మళ్ళి
ఢిల్లీని మాళవ్య
కాంగ్రేసు గద్దెపై
కళలెన్నొ జిమ్మాడు !

ముప్పదీ మూడేండ్ల
వయసులో పసికట్టి
సర్వ పక్షాలకూ
సామరస్యము కూర్చి
బాధ్యతాయుతమైన
ప్రభుతనే కోరింది !

అమృత్సర్ కాంగ్రేసు
అధ్యక్ష పీఠాన
దండిగా గూర్చుండె
పండితుడు మోతిలాల్ !

## కొడుకు

యుద్ధమున ప్రభుతకున్
మద్దతుగ మనమున్న
ప్రతిఫలము యేమయెనొ
ప్రకటించ వేమమ్మ !



## అమ్మ

యుద్ధముడిగినతోడ
బుద్ధిగల కాంగ్రేసు -
స్వయంనిర్ణయ సూత్ర
మమలుపర్చాలంటు
నిర్బంధ శాసనాల్
నీరు గార్చాలంటు
సవినయమ్మున బలుక
సహన మెరుగనియట్లు
పలికితే ప్రవాసము !
ఉలికితే వురిశిక్ష !
కదిలితే ఖైదంట !
మెదిలితే మరణమా !
తొలి లోక యుద్ధమున
తోడైన మనకిట్లు
ప్రతిఫలమ్ముగ నొసగు
బహుమానములు బిడ్డ !

ఆపరిస్థితులలో
అతిలోక భీకరుం
గాంధీజి గనుసైగ
గరచాలనము జేసి

" కనలేద ? వినలేద ?
కర్కశపు పాలనము
కడు ఘోరకృత్యాలు
కావించుచున్నాది
నీ తల్లి భూమిపై
నిలబడ్డ ప్రజమీద;
ఎదిరించ నిలబడుము
ముదమందు నీ తల్లి ! "
అనుచు కాంగ్రేసపుడు
పలుకుపే తడవుగా
గంభీర భావమున్
కలదీసి కున్నాడు
జంభారి తలదన్ను
పుంభావముం జూపి
రొలపేట్టును ఎదర
రణరంగమున దుమికి
సత్యాగ్రహాస్త్రమున్
సంధించి విడిచాడు !

రణదుందుభిని గొట్టు
రణరంగవీరుడా
స్వామిశ్రద్ధానందు

జంపుదుము మేమన్న -
సాయుధుల సైనికుల
సత్వరమ్ముగ బిల్చి
ఆలసించకు డంటు
అంగరఖ తొలగించి
గుండెజూపించుచూ
గుండ్ల గాల్చండంటు
దండిగా నిలబడగ
తెల్ల మొగములువై చె
తెల్లోళ్ళ సైనికులు !

## కొడుకు

ఆపదలు తొలిగాక
ఆదుకొన్నా ప్రజల
కష్ట కష్టము లిడుట
అన్యాయమంటావు
అమ్మరో నీ వెపుడు !

## అమ్మ

ఉపకార మొనరించ
అపకార మొనరించు
నీతిలేనీ వారు

పాతకులు వారబ్బి !

గూర్జనూ వాలాను
కల్నలౌ ఓబ్రియన్
కడుఘోర కృత్యాలు !

కసూ్సరు గ్రామమున
కెప్టెనౌ డవుటనూ
దౌర్జన్య కృత్యాలు !

షేక్పురా పట్టమున
బాస్వర్తు స్మిత్తులా
బద్మాషు కార్యాలు !

ఓ డయ్య రొానరించు
కడునీచమైనట్టి
దుష్కృత్య దౌష్ట్యాలు !

పలుకాడగా రాని
పరమ దుర్మార్గాలు !
వినజాలనట్టివా
విపరీత ఘోరాలు !

కలకత్త కాంగ్రేసు
గద్దెపై గూర్చుండి
కాలానుకూలుండు
లాలాజి వెలుగొందె !

జే. వి. బాగ్ హత్యలతొ
నాయకుల నిర్బంధ
మాయ కుట్రలతోడ
అట్టుడికి పోవంగ
అమ్మ భారతభూమి !
అసహాయ ఉద్యమము
ఆరంభ మయ్యింది !

బాపూజి నేతయై
బరిమీది కొచ్చాడు !
ప్రత్యక్షమైయున్న
పరదేశ వస్తువులు
భారతీయంబైన
దారిద్ర్య చిహ్నాలు
పనికిరావని పలికి
ఒద్దికౌ నట్లుగా
ఖద్దరే కట్టాలి !

పరదేశ వస్తువుల
బహిష్కరించాలంటు
ప్రజలెల్ల రొక్కసై
వంత బలికారురా !

## కొడుకు

మహనీయమైనట్టి
మానవత్వం బిపుడు
దానవుల జెండాడ
ధరనిల్చె నందువూ !

## అమ్మ

వినయ పూర్వకమైన
విజ్ఞప్తులణగారె !
తలవంచి ప్రార్థించు
గౌరవము నశియించె !
అసహాయ ఉద్యమము
అవతరించిందపుడు !

నాగపూర్కాంగ్రేసు
నాయకుండై నాడు
విజయ రాఘవచారి !

అమృతసరు తోటలో
నెత్రుటేరులు పారి
నూతనోత్తేజమున్
దేశాన నెలకొల్పి
వాడ వాడల నిల్పి
మోడుబారదు దేశ
మోడిపోవదటంచు
దృఢదీక్ష ప్రజలకూ
దివ్యమ్ముగానిచ్చి
కనుచూపు మేరలో
కలదు విజయమ్మంచు
పూరించె శంఖమ్ము
పూజ్యుడా బాపూజి !

అహమదాబాదులో
అజములూఖా నపుడు
అధ్యక్షుడైనాడు !

బాలప్రాయమునుండి
యౌవనం బెదుగుటను
ఆర్ధికపు బిల్లులను
ఆద్యంతరూపాల

అవలోకనము జేసి
మంచి చెడుగుల నెంచు
మర్యాద సాధించ
పదిరెండు యేండ్లుగా
పంతాలు బోయింది
పరువుగా నిల్చుంది
ఇరువదొకటీ దనుక !

ముప్పదారవయేట
గొప్పగా నిల్చుండి
వేల్సు యువరాజునూ
వెనుదిరిగి పొమ్మంచు
బహిరంగ పరచింది
బహిష్కారోద్యమము !

సమరశంఖా నాద
మమరమై మ్రోగంగ
కచ్చేరి కాలేజి
కోర్టులాదిగ గ్రామ
కొలువులన్నిట గూడ
సర్కారు నౌకరీ
సాగించ బోమంటు
ప్రజలెల్ల రా నాడు -

పదవులన్ వదలేసి
ప్రథన యోధులుగాగ-

స్వారాజ్య వాదులూ
సొగారి మధ్యలో
సాగేటి ఉద్యమము
సత్యాగ్రహమ్మునూ
చల్లబరచేసారు !
కుళ్ళగించేసారు !

జాతీయ కాంగ్రేసు
గద్దెపై గయలోన
చిత్తరంజనదాసు
చిరునవ్వు నవ్వేడు

మాప్లాల విప్లవము;
చీరాల పేరాల
సత్యాగ్రహమ్మునూ;
పల్నాటిదౌ పన్ను
నిరాకరణోద్యమము;
బార్డోలి రైతులా
సమరసన్నాహమున్;

చౌరిచౌరాకాండ
సంఘటించుట తోడ
సమరవీరుడు గాంధి
సత్యసంధుడు గాంధి
సాగేటి సమరమును
సమయింప జేయంగ
సంస్థలో చీలికలు
పొడచూపినాయిరా !

బాపూజి నిర్బంధ
భాగోతమయ్యాక
స్వారాజ్య పార్టీకి
నోఛేంజరయ్యలకు
జగడాలు ముదిరాయి
జంభారు లయ్యారు ;

అబ్దులూకాలాము
ఆజాదు పండితుడు
ఢిల్లి కాంగ్రేసులో
అల్లారు ముద్దౌను !

మహమదాలీ భాయి
మంచెపై గూర్చున్న

కాంగ్రేసు సభలోన
కాకినాడా పురిని;
అన్న దమ్ముల మధ్య
ఐకమత్యము గుదిరి
చట్టసభలను జేరు
సన్నాహపరులైరి !

వందెమాతరమంటు
మందె రాజ్యంబంటు
స్వాతంత్ర్య నిర్వచన
సృష్టగా రూపొంది
లోకమాన్యుడు తిలకు
వాసిగాంచెను నాడు !

బెల్గాములో గాంధి
జాతీయ కాంగ్రేసు
నేతయై వెలుగొందె !

ఆంధ్రలో మన్యమున
ఆంగ్లప్రభుతను ఎదిరి
అధిపతిని నే నంటు
ఆంధ్ర వీరుడు రాజు
తిరుగుబా టొనరించి

తీవ్రముగ బోరాడి
తెలుగు వెలుగును నేల
నాల్గుచెరగుల నింపి
ప్రఖ్యాతి గన్నాడు!

కానూర్పురు కాంగ్రేసు
కర్ణధారిణి గదా
శ్రీమతీ నాయుడూ !

జాతీయ కాంగ్రేసు
గద్దెపై గౌహుతిని
ప్రెసిడెంటయింగారు
ప్రఖ్యాతి గాంచాడు !

అన్సారి డాక్టరా
మదరాసు కాంగ్రేసు
మణి కిరీటము దాల్చె !

గాంధీజి విడుదలై
కాంగ్రేసు రథమెక్కి
" సాగారి రాబోవు
సైమన్‌కమీషనకు

స్వాగతంబిడరాదు
సర్వపక్షములనగ "
గౌరవించిరి నాడు
పౌరులెల్లరు గూడ
బాపూజి పలుకునూ !

కాంగ్రేసు మహాసభ
కలకత్త గద్దెపై
మోతిలాల్నెహ్రూజి
జ్యోతియై వెలుగొందె !

జాతీయ కాంగ్రేసు
లాహోరు గద్దెపై
జహ్వారుం డుదయించి
సంపూర్ణ స్వారాజ్య
సాధనంబౌ గదా
కాంగ్రేసు లక్ష్యమని
లక్ష్యమును వివరించ
ఏడాది లోపుగా
డొమినియన్ స్టేటస్సు
కట్టబెట్టాలనుచు
తప్ప దివ్వాలనుచు

పట్టుబట్టారపుడు
అల్టిమేటం బిచ్చి !

రాజీలు మాటాడ
రాజప్రతినిధి రాగ
రాజసము జూపించి
స్వాతంత్ర్య దీక్షతో
సత్యాగ్రహాస్త్రమును
సంధించి సమరమున
శతసహస్రమ్ముల్తో
సమర సేనలతోడ
ఉప్పుకొఠార్ల పై
గొప్పగా ఉరికాడు
కొల్లాయి గట్టినా
కొమటో రబ్బాయి !

గుండెదిటవూ గల్గు
దండియోధుడు గాంధి
దండి కొఠార్ల పై
దండునడుపుచు తాను
గుప్పెడుప్పును బట్టి
గొప్పసామ్రాజ్యమును

ముప్పతిప్పలుబెట్టి
మూడు చెరువుల నీరు
త్రాగించి కలఁగించ.

క్రొంచి విప్లవమందు
పెనుగాలియై వీచు
గాలిలీ కథ కొంత
జ్ఞప్తికొచ్చెనో ఏమొ;

సప్రు జయకరులతో
రాయబారము నడిపి
రాజీలు కుదిరించి
బందీలుగా నున్న
గాంధేయు లెల్లరను
హుందాగ విడిపించి

గాంధితో ఇర్విను
కరచాలనము జేసి
కలసి మాటాడితా
కలిగించె నొడబడిక.

కొడుకు
తెల్లదొరలిప్పటికి

ఉల్లమును మార్చుకొని
వెళ్ళజూస్తున్నారర ?
వివరించుమో యమ్మ
వేవేగ విషయమును !

అమ్మ

అంతంత మాత్రమున
అధికారమును వీడి
ఆవలకు బోదురా ?
ఆలకించుము బిడ్డ !

బక్కరైతులపట్ల
మ్రొక్కులా దేవుడా
ఉక్కుమనిషి పటేలు
ముక్కువ గను కరాచి
కాంగ్రేసు గద్దెక్కి
రాజప్రతినిధి జరుపు
రాజీని మన్నించి
గౌరవింపగజేసి
ఘనముగా వర్తించె !

పరదేశవస్త్రాల

బహిష్కరణోద్యమము
బ్రహ్మాండ రూపమున
ప్రజ్వలించిం దపుడు !

గుండ్రబల్లకు రమ్మ
గాంధీజియని పిల్చి
ముచ్చట్లు సాగించి
ముచ్చులో పాలకులు
చప్పట్లు చరిచారు
సాగనంపేశారు !

రణగుణధ్వనులలో
రణచోడెలా లపుడు
హస్తిపురి కాంగ్రేసు
కధ్యక్షుడాయెరా !

గుండ్రబల్లనుగూడి
గుడగుడలు సాగించి
గుడిదిరిగి మళ్ళినటు
తిరిగొచ్చు దారిలో
నరవరుని గాంధీని
దొరవారు బంధించి

మరగునన్ బెట్టేసి
కాంగ్రేసు సంస్థనూ
కాల రాయాలనుచు
వన్ ఫార్టి ఫోరుతో
గన్‌షాట్ల గదిమినన్
సమకూడి జనులీడ
సభలెన్నొ జరిపారు
సమర రంగాలనగ !
తన్నులే తిన్నారు
పన్ను లెగబెట్టారు !

బాపూజి ఉపవాస
వ్రతమేసొ జరిగింది !
శాంతి సంగ్రామమ్ము
శాంతించె సొంతమ్ము !

తెల్లమ్మ నెల్లిమ్మ
కలకత్త కాంగ్రేసు
గద్దెపై వెలుగొంది
ముద్దుగా బలికింది;
" మద్యపానము లేక
మనుజులై మెలగాలి

భారతీయు లటంచు "
బోధింపు శైలిలో !

బొంబాయి కాంగ్రేసు
గద్దెపై గూర్చుండి
రాజేంద్ర ప్రసాదు
రాణించె నెంతయో !

యౌవనము ముదిరింది
కౌమార మేతెంచె
ఒకరి పెత్తనమేల ?
స్వపరిపాలన·వలయు
సవ్యమ్ముగా నిడుడు
సందేహపడకంచు
పదునాలుగేండ్లుగా
పట్టుబట్టియు కడకు
సమరధోరణి బలికి
సాధించి తీరింది
ముప్పదై దూలోన !

## కొడుకు

తలపునందున్నట్టి

వలపు దీరంగ నా
భారతీ జాతీయ
కాంగ్రేసు సంఘమ్ము
తగుబాటమే నడిపి
తరియించె నందువా
మొగసిరిగి మాయమ్మ ?

## అమ్మ

ఉబలాట పడబోకు
ఉన్నదున్నటు జెపుదు
ఊకొట్టు చుండరా !

ఇంతమాత్రము బొంద
ఎన్నెన్ని కష్టాల
ఎదిరించినారురా ?
మదికంద వినుమురా !

శాసనోల్లంఘనము
ఉప్పు సత్యాగ్రహము
తూటాల కాల్పులూ
లాఠీల దెబ్బలూ
చిత్రహింసలు బాబు

చెప్ప శక్యముగాదు !

ఇరువదొక్కటి నుండి
ముప్పదై దూదనుక
పడరాని పాట్లెన్నొ
పడ్డాది దొడ్డగా !
ఎనలేని క్లేశాలు
అనుభవించిందెన్నొ !
ఎట్టకేలకు తాను
పట్టాభిషేకమ్ము
కట్టుకొన్నాదిరా !
కొమరులే మంత్రులై
కులుకుచున్నారురా !

అటువంటి సమయమున
ఇండియాప్రభుత్వపు
యాక్టొచ్చి నిలబడగ
ఏబదవ పడినున్న
ఆపదన్ మదినిడక
కాంగ్రించి ఉమ్మేసి
కాల్దువ్వె కాంగ్రేసు !

జవనాశ్వమున వెల్గు
జవహరుం డలనాటి
యువనాయకుండౌట
లక్నో కాంగ్రేసులో
రారాజులన్ మించె !

ఫెయిజుపూర్ కాంగ్రేసు
ప్రెసిడెంటు జవ్హారు
రై జింగు సూర్యుడై
రాణించె గద్దెపై !

ఎన్నికల తంతులో
సన్నుతులు గైకొంటు
రాజ్యాంగ యంత్రమును
రాజసమ్మున బట్టి
మంత్రిత్వములు బొంది
మహినేలు చుండిరీ
మనవారు ఘనముగా !

స్వారాజ్య పక్షంబు
సాగించు చర్యలూ ;
బూలుభాయ్ దేశాయి

బూకరింపుల బాణీ;
మంత్రాంగ నిర్మాణ
ప్రాంతాల స్వాతంత్ర్య
పాలనా పద్ధతులు !
ప్రభుతనం దెనలేని
పాశవిక నృత్యమ్ము;
గాంధీజి కవగతము !

హరిపురా - కాంగ్రెసు
అధ్యక్షుడై బోసు
హరిహరాదుల మించి
బరిమీద నిల్చెరా !

జాతీయ కాంగ్రేసు
త్రిపురీ సమావేశ
తిరునాళ్ళ తీర్థమున
బోసు ప్రెసిడెంటాట
వాసిగాంచు గాద !

పెద్దలన్ ఎదిరించి
గద్దెక్కి శ్రీ బోసు
తగులాట మేలంటు
తప్పుకున్నా డపుడు;

గొప్పగా నిల్చేడు;
చెప్పుకోదగినట్లు
ఒప్పుగా చరియించి
తల్లివుల్లము నుంట
తరుణయోధుల బిల్చి
ఫార్వర్డు బ్లాకంటు
పార్టీని కట్టాడు
పావనుం డతగాడు !

రామఘరు కాంగ్రేసు
రాజాదు ప్రెసిడెంటు !

మూరెమ్మవలె నాడు
మలిలోక యుద్ధమ్ము
మహిమీద తిరుగాడ
మంత్రులౌ మనవారు
శ్వేత పాలకులకూ
చెల్లు చీటీ లిచ్చి;
సామ్రాజ్య వాదులా
సమరాని కెదురంటు
ఏబదారవ ఏట
ఎదురొడ్డి నిలబడగ

సౌఖ్యాలు త్యజియించి
సర్వస్వ మర్పించి
సాబర్మతీ యోగి
సమరాంగణమ్ముననన్
శంఖమ్ము పూరించి
హక్కుమనయది మనము
భుక్తమ్ము జేసుకొన
శక్తిస్వరూపులై
చేవ దేలాలంటు;
చుక్కైన రక్తమ్ము
చిందరాదను మాట;
మొండెమీ రణభూమి
నుండరాదను మాట;
అరివీరు డొక్కడూ
అణగరాదను మాట;
అందుచే తడవుగా
ఏ పల్లె కా పల్లె
ఏకమై నిల్చింది
అవిభక్త వంశమై!
ఆదర్శ గ్రామమై
అఖిల దేశంబుండె!
ప్రహ్లాదులైనారు

పిల్లలెల్లరు కూడ !
వయసు గల్గినవారు
ఏసులై నిల్చారు !
బుద్ధావతారులై
పెద్దలున్నారురా !
ఆబాలగోపాల
మంగభేదము మర చి
శాంతి స్వరూపులై
సమర రంగమునందు
సాక్షాత్కరించారు !
వ్యక్తిసత్యాగ్రహము
రక్తిగట్టించటుల !

గాంధేయ పథమునన్
కడవరకు నిలుచుండి
కాంగ్రేసు చరితమును
కమ్మగా రచియించి
జయహారు కాంగ్రేసు
జయజయధ్వనులలో
పట్టాభిషిక్తుడై
పట్టాభి మురిసెరా !

క్రిప్సుదొరగా రొచ్చి
సంప్రదింపులసంధి
చల్లంగ జరిపియున్
అధికార ద త్తతకు
ఆమోద మివకుంట
అగ్రనాయకులపుడు
ఉగ్రస్వరూపులై
ఆంగ్లశాసన మీద
అమలు గారాదంటు
" చేయండి లేకుంటె
చావండి ప్రజలంటు"
జనులకందరి కపుడు
సైగలే జేసారు!
సందేశ మిచ్చారు!
హుందాగ నడచారు!

శాంతిమూర్తుల రూపు
క్రాంతి దర్శన మిడగ
శ్వేతశాసకు లీడ-
జాతీయ కాంగ్రేసు
అక్రమపు సంస్థయని
ఆర్డినెన్సును బెట్టి

నాయకాగ్రేసరుల
నడిరేయి బంధించ
సేనాధిపతి లేని
సేనకై వడి ప్రజలు
శ్వేతపాలన పైన
చెయిజేసుకున్నారు !
దయనీయ మౌనట్లు
దండించ బడ్డారు !

సామ్రాజ్య వాదులా
సైతాను కృత్యాలు
సామాన్య ప్రజలీడ
సైచలేకున్నట్టి
సంగతులు మదినెంచి
మహనీయుడా మనిషి
మనగాంధి తాతయ్య
ప్రాయోపవేశమును
పాలించినాడురా !

అరిభయంకరమైన
అనశన వ్రతమేమొ
ఆంగ్ల సామ్రాట్టులన్

బెదర కొట్టేసింది !
మదిని మార్చేసింది !
అదుపులో బెట్టింది !

అది కారణమ్ముగా
ఆంగ్ల సామ్రాజ్యమీ
బందీల నందరిని
బంధముక్తుల జేసి
సంధి సంప్రదింపుల
కామాత్య త్రయమును
అట్టె పంపిందిరా !

ఏకైక రాజ్యాంగ
ప్రజల పరిషత్తునే
నిర్మించుటానంటు
నీతులే పలికింది !
ఐక్యభారత పథక
మాదిలో చూపింది !
ఆత్మలో కుందింది !
కళవళా పడ్డాది
కాదు కాదనుకొంది !
మతభేదముల రేపి

ఇస్లాములను లేపి
ఇసుకు గొల్పిందిరా!

ముసుగు తొలగించుకొని
మురిసింది తరిసింది
తల్లి భారతధరను
కుల్లగించేసింది!

రెండు ఖండాలుగా
ఖండింపజేసింది!

ముండమోపిగ తాను
మూటముల్లే గట్టి
దాటింది సంద్రమును!

పైవన్నికూడనూ
పరికించి యోచించ
రాజకీయంబుగా
నరకాగ్నులౌగదా!

అయినంత మాత్రమున
ఆదర్శ లక్ష్యాన్ని

అతిక్రమించను లేదు
ఆశ కోల్పోలేదు !

నైరాశ్య మెదిగినా
నిస్పృహే కలిగినా
ప్రత్యర్థి పగబూని
బహిరంగ సత్యమై
కత్తిగట్టిన గూడ
కర్తవ్యచ్యుతిరాక
కడదాక నిల్చింది !

ప్రత్యర్థి పగబూని
పశుబలమ్మున గ్రుమ్మ
ప్రతిఘాత మెరుగకా
పావనం బైనట్టి
పథమునం దొలగకా
ప్రధనముం దొలగదూ !

లక్ష్యమ్ము కన్నసూ
సాధనౌ గదా మహి
మాన్వితంబైనదీ !

[8]

విజయమ్ము కన్ననూ
ఉత్కృష్టమైనదా
సమరమోగడ బిడ్డ !

వితథమ్ము నుండియూ
సతత సత్యమ్మునూ;
నిబిడాంధకారమున
నిర్మల జ్యోతులూ;
చావులో నుండియూ
సంజీవి గుటికయూ;
సమధి కోత్సాహమ్ము;
సాహసౌదార్యమ్ము;
సాధించి యున్నాది
స్వాతంత్ర్య సముపార్జ
నాయత్న హోమమున !

విశ్వాసముడుగంటు
దుస్సమయములు గాని;
ఉత్సాహమణగార్చు
ప్రోత్సాహములుగాని;
రాజ్యమేలాలంటు
రాకపోలేదురా !

ఆత్మ విశ్వాసమ్మ
మానసోల్లాసమును
మర్యాదనిలిపాయి !

అచలమ్ముల విదల్చు
ఆత్మవిశ్వాసమ్ము !

అద్భుతపు కృత్యాల
నవలీల సాధించు
ఉత్సాహమెంతయును !

నిబిడాంధకారమున
నిత్య నూతనకాంతి !
నిస్పృహా వస్థలో
అద్భుతాశాజ్యోతి !
దృగ్గొచరం బౌను
దృఢ దీక్షతోనుండ !
శాశ్వతంబైనట్టి
సత్యాహింసలౌను
సాయమ్ము నీ కనుచు
సాగారిపోయింది !

మానవుల నమ్మింది!
మహిని ప్రేమించింది!
అవిరళా కృషిజేసి
ఆనందమందింది!

శత్రువుల చెండాడు
క్షాత్రమ్ము వెలువడని -
వైరి రక్తము నోడ్చు
క్రౌర్యమ్ము గనరాని -
సత్యాగ్రహోద్యమము
శాంతిసంగ్రామమ్ము
సాగించి మన గాంధి;
ఉక్కు చట్టమ్ములో
నొక్కిపట్టిన మనల
పాలించు పాలకుల
పారద్రోలాడురా!

మట్టి సుద్దలనుండి
మనుజులను సృజియించి
మానవోత్తముడైన
మహనీయుడైనాడు
మన పూజ్య బాపుజీ!

విధిచెయిదమను మాట
మతిలేని కూతంటు
చరితమును తలక్రిందు
చేసి చూపాడురా!
కాలాన్ని గాంధీజి
కాలదన్నాడురా!

## కొడుకు

స్వాతంత్ర్య మదివచ్చె!
స్వారాజ్యమును వచ్చె!
కాంగ్రేసు కలలన్ని
కార్యరూపముదాల్చె!
ఆశయమ్మిదేరి
ఆనందమందేటి
కాంగ్రేసు సంఘంబు
విశ్రాంతిగైకొనగ
విడిదికే తెంచెనా?
విసువుడిగి జనతలో
విహరించుచుండెనా?
వినుపించు మోయమ్మ
వింపు నా కాస్తయున్

## అమ్మ

ఆర్థిక సమానతను
ఆర్జించ సమకట్టి
పోరాడు తోందిరా!

మిట్ట పల్లము లెదుగు
గుట్టేమొగనరాగ
జాతి మత కుల భేద
నీతులను హాతమార్చ
ఊతముగ ఉన్నట్టి
జే. బీ. కృపాలినీ
హాబీగ ప్రెసిడెంటు
జాతీయ కాంగ్రేసు
మీరట్మహా సభకు!

సోషలిష్టు సమాజ
సోపాన మనగ్గ నా
ఆవడీ కాంగ్రేసు
ఆదర్శవాదిరా
ప్రెసిడెంటు దేబరూ!

పక్షపాతము లేక

కుక్షినింపెడు తల్లి
దక్షతను వెలుగొందు
ఇందిరా గాంధిరా
హుందాగ గద్దెపై
అందాలు చిందెరా !

జాతీయ భావాలు
పుంజీభవించినా
సంజీవరెడ్డిరా
రంజిల్లు చున్నాడు !

జాతీయ కాంగ్రేసు
జన్మించి భరతోర్వి
పుష్పించి ఫలియించి
పంటకాపులకిచ్చి
కంటగని పెడుతున్న
కథ జెపితి బాలకా !
పదిలమ్ము నుంచరా
మదిలోన వదలకా !

—: :—

శుభం.



| | | |
|---|---|---|
| మహాస్థాఫ్ | చలం | 5-00 |
| ఆత్మార్పణ | చలం | 2-50 |
| అనసూయ | చలం | 3-25 |
| బుజ్జిగాడు | చలం | 1-50 |
| తిరిగిరాలేదు | కె. లింగరాజు | 2-25 |
| విరుద్ధ ఫలితాలు | ముద్దంశెట్టి | 2-00 |
| బృందావనం | పురాణం | 1-50 |
| తారకమంత్రం | కవులూరి | 1-00 |
| కా[illegible]కరణం | దిలీప్ | [illegible] |
| పావురాలు | సభా | [illegible] |
| ప్రియురాలు | బి. వి. నరసింహారా | [illegible] |
| కాలలోకం | బి. వి. నరసింహారా | [illegible] |
| రక్తసంబంధం | లింగంశేని | [illegible] |
| ప్రియురాలు | పి. వి. రత్నం | [illegible] |
| పార్శ్వధ్వనులు | పి. వి. రత్నం | 0-75 |
| స్నేహితులు | ఎస్. గిరి | 0-75 |
| సాహిత్య రత్నాలు | పి. వి. రత్నం | 1-50 |
| కిల్లాడి కన్నెరిరాము | బాజ్జీ | 1-25 |
| హాతింతాయి కథలు | బాజ్జీ | 2-50 |
| రష్యాదేశపు జానపద కథలు | బాజ్జీ | 2-25 |
| తాతా మనుమడు | కాశీవిశ్వనాథం | 0-75 |
| అమ్మా కొడుకు | కాశీవిశ్వనాథం | 1-25 |
| బిస్కెట్లు | కాశీవిశ్వనాథం | 0-50 |

ప్రజా ప్రచురణలు
పవరుపేట - ఏలూరు.




MUMUKSHUVU PRESS, ELURU



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | 1PWA101B127 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 22-10-29 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 73 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | bci,68 |
| లేని పేజీలు | 1 to 2 |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | MOUNICA |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | no |
| [illegible] | Good |